# గానామృతము.



కానూరి వేంకట సుబ్బారావు
సువాసిన్యాది నవలలగ్రంథకర్త
కాకినాడ.



వెల 0—1—6

## విజ్ఞప్తి

ఇందు ప్రచురింపబడిన రెండవకీర్తన చాలా దూరము ప్రాకిపోయి బహుజనాదరణీయమగుటను నా స్నేహితులనేకులు నేను వ్రాసిన కీర్తనల ప్రచురింప ప్రోత్సహించుట చేతను యిది ప్రచురించితిని. పండితులిందలి తప్పులు మన్నింతురు గాక.

కానూరి వేంకటసుబ్బారావు,

గ్రంథకర్త.

ఓం

# గానామృతము.

"రాధాకేళిలోలా - సుశీలా - రాజిత గుణశీల" వలె॥

గణనాయకా - మాంపాహి - కామితమందార॥గ॥

1 విఘ్నములనుసద - వేడినవారికి - తొలగ
జేసెదవు। వినాయక - భక్తులబ్రోచెదవు॥గ॥

2 సమమున బక్తిమనో దిట్టతలేకయు - శరవును
మఱచితిని - గణేశ్వర - దాసిని జూపుతండ్రీ॥గ॥

3 నిను మదనమ్మితి - మూషక వాహనా -
నమ్మినబ్రోవుతండ్రీ - ఓ దేవా - నీవయొకగతినాకు॥గ॥

4 భక్తుడ కానూరి వంశజుడను - సుబ్రహ్మ
ణ్యడను - గణనాయక - బ్రోవగనసమయమిదె॥గ॥

2

"చెలిపూతి హైమేడేరి సిబ్బరి తెరచి రంగే
లిడవారి" వలె

హిందూస్థానినాయకి—ఏకతాళం

చెలిరా మాయణంబు వేగమే - నేను తెల్పెద
దయయుంచుమా। నేను తెల్పెద దయ యుంచు
మా॥ చెలి॥

4

2 సుందరమైన నీమోము ముఖారవిందము- అంద
ముగా నాదునయనమి లోకన-కందనీయము - శ్రీ
రామా-అందనీయము ॥ గా ॥ అ ॥

3 పాపవిమోచన - దుష్ట సంహారిక - గావ
క్రిష్ణమ్మగోవిందము రామా- బ్రోవుమునన్ను - ఓ దేవ
బ్రో ॥ గా ॥ అ ॥

4 పొందుగ పేకేటి పురవర వాసియౌ -
కానూరి సుబ్రియకవి వరునిపాపక - జామము
నన్ను - సీతాపతే - జా ॥ గా ॥ అ ॥

5

"ఓరిఓరిబండివాడ - వగలమారిబండివాడ" వలె

నాయకదర్బారు—త్రిశ్రజాతిలఘువు

సుబ్రహ్మణ్యేశ్వర - విశ్వ ఆనందరూపా- పరమానం
దరూపా - నిత్యకళ్యాణ రూపా ॥ సు ॥

1 నీచరణసన్నిధిసే - నిలచివేడుచుంటిని- నీదు
మహాత్మ్యములు - నన్నుతింప నాదరమె ॥ సు ॥

2 వేదాంత వేద్యులకు - భక్త గ్రిగణ్యులకు
పరమహంస నిందుర్లకు - పట్టుగొమ్మవీకాగా ॥ సు ॥

3 దంపతుల ప్రేమలోన - మంచు ముత్యముల
లోన - విహాగములకూతలోన- అంతటనీవె కా ॥సు॥

4 పరమాణువునందు - పంచ భూతంబులందు
ఆదఓంకారమందు - సర్వంబు నీవెకా ॥ సు ॥

5 పేకేటి పురనివాసి - కానూరి వంశ జుడు
సుబ్రియశంకరుడు - నీకిడెనమస్కృతుల్ ॥ సు ॥

6

"శ్యామగ హేసగసీ - సాయేలీ యేము" వలె

ముఖారి—ఆది॥

భక్తు (పబ్రోవుతల్లి - శాంభవిదయన్ ॥ భ ॥

1 సంసార సాగరాంబున బడిదేలలేక -
నసనిడి స్థితిగతులెలుమిని శోధనలేని ॥ భ ॥

2 ఆపన్నివారణీ - ఓంకారరూపిణీ - పాపవినాశని
ముక్తిప్రదాయిని ॥ భ ॥

3 అరిషడ్వర్గము - నవిద్యనయించలేక - కరము
దుష్కర్మల - పడి పడి జేసిన ॥ భ ॥

4 మదిమరిగలగగ - దరిగాననినీదు-
పదపద్మములన్ - శరణని గొలిచెడి ॥ భ ॥

5 శాంతస్వరూపిణి - భక్తప్రమోదిని - విమ-
లాంతఃకరణి - గననీ వెగతి ॥ భ ॥

6 ధరమూర్యరాట్పురి - వెలసిన త్రిపురసుందరి
తల్లి కానూరి - సుబ్రియపోషణి ॥ భ ॥

2 కృష్ణలీలలు - బృందావనమున - చిత్రింప
జేసిన - యోద్ధై వరాయణా ॥ ర ॥

3 సుబ్రియుకవివరు - మానసమున -
తాండవమాడుచున్న - నరసింహమూర్తి ॥ ర ॥

9

"ఎవరనిరైరా- కుమారా" వలె

హిందూస్థానికన్నడ—ఆది॥

ఎందుదాగితివి - శ్రీరామ - ఎచ్చటుంటివిరా
ఆగుసందు నెందునైన- నెంత వెతకినను - కాన్పిం
పవు ॥ ఎం॥

1 నాల్గు వేదముల్ హరియింపదలంచి -
సోమకాసురుడు వనుదెంచినేమి - నిగమముల_ర
క్షణకును _ ఏగుదెంచితివా ॥ శ్రీ ॥ ఎం ॥

2 క్షీరసాగర మథనమునకై
మంధరగిరి నెదధరి యింపదలంచి
కూర్మరూపివై - ఎత్తబోయితివ- ఏమి తెలుపవు॥
శ్రీ ॥ ఎం ॥

3 ధరణసురుడు చాపగచుట్టగనా।
రక్షింపభూదేవిని గోరనేమి
వరాహరూపివై - రక్షింప నెంచి - యచటికి
బోయితివా ॥ శ్రీ ॥ ఎం ॥

4 భక్తిపుంజమగు ప్రహ్లాదుడేడి
యిడుమలగుడిపిన హిరణ్యుడేడి
నిజముగాను - గలిగెనంచు - నారసింహావతారు-
డయితివా ॥ ఎం ॥

5 అలబలిమతలను భూలోకమునకు।
జనుదెంచికొత్తువుల నావించునచు।
భాంతిచేత - వెదుకబోయితివ - పలుకరేంరా॥
శ్రీ ॥ ఎం ॥

6 క్షత్రియ వీరుల పొగరడగింప।
పరశురాముడవై యరుగుదెంచితివ।
ఏమిదెలుపవు - ఏమిపాపము - ఎటుల బ్రతు
కుదురా ॥ శ్రీ ॥ ఎం ॥

7 రావణకుంభకర్ణులుయిలను
జననమందిరని కలయుండుగంటివా
వారిజంపగ - రాముడవునై - యవతరించితి
వా ॥ శ్రీ ॥ ఎం ॥

8 దంతవక్త్ర శిశుపాలు రుయిలను
తొందరగలిగించుచుండెనాయేమి।
వారిజంపగ - బలరామ కృష్ణవునై తివ॥
శ్రీ ॥ ఎం ॥

9 నీతిశోధం చేయంగదలచి।
మానవుంమార్గమున నూపంగదలచి।
బుద్ధకల్కివ్యా - వతారములను - ప్రజలకుమా
పగను - బోయితివా ॥ఎం॥
10 కానూరి సుబ్రాయకవివరుడునిన్ను
ఎల్లప్పుడుమదియందుస్థుతియించుచుండు। జూప
వేమినీదుదయను - బ్రోవనేమిరా ॥ శ్రీ ॥ ఎం ॥

10

నాదనామక్రియ—తిశ్రజాతి

హారతిగొనవాణి - మహాభక్తసిద్ధి ప్రదాయని॥హా॥
1 అఖిలవిద్యలతల్లి - తమమెల్ల బాపుమా తా
వకలలోపాలిని - మముబ్రోవనీకిదె హారతి॥హా॥
2 వేదములకుతల్లి - పాణికమలగర్భరాణి
రాధాక్రిష్ణ పేరబరగు - నీదుఆలయమున నిడెము॥హా॥

గానామృతము.

ప్రథమభాగము,

సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.

# రాధాకృష్ణగ్రంథమాల.

ఇందుసాంఘిక, చరిత్రవిషయిక, అపరాధపరిశోధక కల్పిత నవలలును ప్రహసనములును నీతి దాయకములగు సద్గ్రంథములు మహాపురుషుల జీవితగ్రంథములును భక్తిరసప్రధానములగు పాట్టులు ప్రచురింపబడును.

## వెలువడినగ్రంథములు.

సువాసిని (నవల) వెల రు. 0—2—0

గానామృతము. వెల రు. 0—1—6

## వెలువడనున్నవి.

గానామృతము (రెండవభాగము) హిందూస్థానిమట్టుల ననుసరించిన భక్తిరసములగు కీర్తలును, సంక్షిప్తభారత భాగవతములును మాధురకైలినిరచియింపబడినవి. వెల రు. 0—2—0

కబుర్లగంప (కడుపుబ్బ నవ్వుపుట్టించుప్రహసనము) వెల రు. 0—2—0

వలయువారు

కానూరి వేంకటసుబ్బారావు,

సూర్యారావుపేట,

కాకినాడ.

అనివార్యాకు రెక్కె

